# మాతృపూజ

---

ఆంధ్రరత్నము:

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

గారి జ్ఞాపకార్థము

---

*

ప్రకాశకులు:

రామ్ జేయ్ అండు కంపెని,

13. తంబుచెట్టి వీధి,

మద్రాసు.

| ఆరాధకులు— | కుసుమములు. |
|---|---|
| రాయప్రోలు సుబ్బారావు | జన్మభూమి.<br>ఆంధ్రమాత. |
| అబ్బూరి రామకృష్ణారావు | స్వచ్ఛంద ప్రయాణము. |
| విశ్వనాథ సత్యనారాయణ | ముఖలింగము.<br>కొండవీటి పొగమబ్బులు. |
| దువ్వూరి రామిరెడ్డి | నైవేద్యము.<br>సేవ. |
| పురిపండా అప్పలస్వామి | పద్మనాభము.<br>సత్యాగ్రహులు. |
| కవికొండల వేంకటరావు | ఉయ్యాలా! దంబాలా!<br>జాతీయ గీతిక. |
| తురగా వేంకటరామయ్య | నాజన్మభూమి.<br>దొరవు నీ వయ్యేదవురా! |
| బసవరాజు వేంకట అప్పారావు | మాగాంధి. |
| వేంకట పార్వతీశ్వర కవులు | దుందుభిధ్వానము. |



*

మాతృ పూజా ధ్యాన తత్పర
మతి పవిత్ర స్నాతుడవు నై
విశ్వమందిర పుణ్య భూమికి
వెడలి రావోయి !

*

# జన్మభూమి

ఏదేశ మేగినా ఎందుకాలిడిన
ఏపీఠ మెక్కినా యెవ రెదు రయిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గర్వమ్ము

లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు.
ఏ పూర్వపుణ్యమో ఏ యోగబలమొ
జనియించినాడ వీ స్వర్గలోకమున

ఏ మంచిపూవులన్ ప్రేమించినావో !
నిను మోచె నీతల్లి కనకగర్భమున
సూర్యుని వెలుతురుల్ సోకు నందాక
ఓడల జెండాలు ఆడు నందాక

నరుడు ప్రాణాలతో నడుచు నందాక
అందాక గల యీ యనంత భూతల్లిని
మనభూమివంటి కమ్మని భూమిలేదు.
తమతపస్సులు ఋషుల్ ధారవోయంగ

# మాతృపూజ

చండవీర్యము శూరచంద్రు లర్పింప
రాగదుగ్ధము భక్త రాజు లీయంగ
జ్ఞానసూత్రము కవిబాంధవు లల్ల
దిక్కుల కెగఁదన్ను తేజంబు వెలుఁగ

జగముల నూగించు మగతనం బెగయ
రాలుపూవులు సేయు రాగాలు సాగ
సౌందర్య మెగఁబోయు సాహిత్య మొప్ప
వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్య దేశంబు పుత్ర

అవమాన మేలరా! అనుమాన మేల
భరతపుత్రుఁడ నంచు భక్తిఁ బోఁ బుంక!

రాయప్రోలు సుబ్బారావు.



# ఆంధ్రమాత

శ్రీ లింపొందగ యావ దాంధ్రజనమాతృష్నాతపీ నూత్నతే
జ్యోత్స్నాలామృతమాని, దద్బలవదాత్మైక్యంబునన్ తావకో
ద్వేలప్రాక్తనకీర్తిగీతముల సద్గింగాను నీ పుత్రపు
శ్రీలోకమ్మున కేమిఁ జెప్పెదవు సందేశంబు నాంధ్రావనీ!

ఆశాక్రాంతుకపూర్ణచంద్రికలుపూయన్ దుర్గినాచ్ఛాదమా
కాశమ్మున్ విడిపోవ, నూతనకల్లోత్కృష్టాప్తిమై మాతృపూ
జాశోభన్ దయివాను సుశుభదినోత్సాహంబు నిత్యించి, నీ
యాశీర్వాదము లిస్తుపుత్రులకునంబా! యాంధ్రదేవీమణీ!

పేటల్ దేరెడు కాంతిపూరముల సుశ్రీఁచు ముత్యాల ము
ప్పేటల్ బోలె ద్వదీయకంఠమున శోభింపుల్ నిగారించు, చే
నాటన్ జీవనరోషణల్ గని కృష్ణాగౌతమీభద్రలన్
గాటంపుం దమిఁ ద్రావువారు మిడె కాంక్షాక్షీరమాంధ్రావనీ!

ఆచాళుక్యనృపాలరత్నముల పియ్యూష్మంది, శ్రీకాకుళ
స్నాచంద్రకేశులలాలనల్ వడసి, కృష్ణప్రాజ్యసామ్రాజ్యపీ
ఠిచంచజ్జయకన్యతో సరసగోష్ఠిన్ ప్రొద్దుబోఁబుచ్చు నీ
ప్రాచీనాభ్యుదయమ్ము నెన్నెడరు గర్వస్ఫూర్తితల్లీ! సుతుల్.

ఉద్యానోన్మహానమై, కుమారజనగర్వోద్రేకమై, యాంత్రిలిం
గోద్యానాప్తమనూదయమ్మగు నవీనోత్సాహపున్ వేళ, నా

విద్యారణ్యయుగంధరాదుల యశోవీర్యమ్ములగ్గించు, చీ
విద్యాస్నాతకు లాసఁజేసెదరు, దేవి! సంప్రసాదింపవే.

జారినదేశగౌరవముఁ జక్కనదిద్ది, మహాంధ్రమాతలీ
భారము శ్లాఘనీయముగఁ బాలనఁజేసి సమానరాష్ట్రముల్
కూరిమినాసఁజేయ, తెలుఁగుం బుడమిన్ గయిసేయరయ్య, దీ
టౌరతి నాంధ్రపుత్రులు! జగజ్జనధన్యమౌ దృష్టినిల్పుచున్.

ఉల్లాసమ్మున మాతృసేవ పయిపై నుఱ్ఱూతలూగంగ నా
పల్లీపక్కణదిగ్దిగంతర స్థలీ పర్యంత వేంగీభువిన్,
జల్లుండాంధ్రమహోద్యమప్రథమపూజాపుష్పముల్ ప్రేమపుం
ద్రోళ్ళంగట్టుఁడు యావదాంధ్రజనసంతానమ్ము నాపైహితుల్.

రణరక్తబంధురారుణమైన ఖడ్గతి
క్కన కత్తి కడిగిన కదనభూమి
అమృతాక్షరవికాసమయిన యా సుకవి పో
తనలేఖిని ప్రశాంతిగనిన చోటు
భాషాకుమారి కబ్బపుఁ బెండ్లియైన
కృష్ణరాజ్యము వెలింగిన తలమ్ము
నానావిదేశనౌకాసక విపులాశ్ర
యంబైన రేవు రూపడిన తావు

# మాతృపూజ

పాడయి శిలావశిష్టమై ప్రాప్తకాల
మనుభవించుచు, నూడియు నక్కటకట
బ్రతికిచెడ్డ యాంధ్రుల పూర్వవైభవంబు
చాటెడిని నాలకింపుడు శాంతమతులు!

కలదాంధ్రోద్యమ వల్లికా కుసుమ రేఖామాలికా కాంతి తుం
దిలశోభాంకురపుంజముల్ భరతమాతృస్ఫీతచూడామణీ!
కలితచ్ఛాయ లనందగింపఁగల భాగ్యంబింక, నీసాంగమం
గళకళ్యాణముఁ జూడఁ బ్రతికలె వేడ్కన్ వత్తురా నాటికిన్.

సంతోషింపఁగదమ్మ! యాంధ్రజననీ! సారస్వతస్నాన వి
భ్రాంతిప్రీతుల, నీదుపుత్రకుల, దీక్షాబద్ధులంజూచి ని
శ్చింతన్ సోదరులార! భూజననిఁ బూజింపుండు బ్రహ్మోర్వణో
పెంతవ్యక్తి మనోబలమ్ము నదధాస్తంచున్ ఋషుల్ పల్కఁగన్.

రాయప్రోలు సుబ్బారావు.



# స్వచ్ఛంద ప్రయాణము

## దివ్యయువతుల సంభాషణము

**సానుమతి**

విడివడుటకోర్వజాలని నవీనమనఃప్రణయమ్ములట్లు ప్రో
ఫుడుల పరస్పరప్రణయమోహనమగు నలలు వడంగి వి
చ్ఛేదుకమలమ్ములవోలె నవే! చేరువం దోచెను నేలం జూడుము
మ్మాడమి విశుద్ధులౌ భరతపుత్రులగాంచినతల్లి నెచ్చెలీ!

జూడనిపారిజాతసుమవల్లరులం దగిలించుకొన్న మీ
నాడలనాకవీథికలు వాడినపూవులవోలె శోభలన్
గోల్పవె, భారతీయపృథివీస్థలిసంతయుం బ్రాకె నేను తూ
గాడి వసంతశోభిరుదయమ్ముల మిన్నులం బాడం గోకిలల్?

వీచీనాదములందు రాగములు పుష్పింపంగ స్వచ్ఛంద శో
భాచిహ్నంబులు వింతలై నయననిర్వాణమ్ము నందించుచున్
లేచెన్ మంటలవోలె నెల్లెడల; పల్లీపట్టణమ్ముల్ ప్రగా
ఢౌచిత్యమ్ముల వెల్గించెను సహస్రాల్ జూడు మాయుష్మతీ!

**మధురిక**

జాహ్నవీసేచనమున స్వచ్ఛమ్మునైన
జీవనముల హిమాలయశిఖరసీమం

# మాతృపూజ

గడపునా నాగరికులకేర్పాటైన యొక్కి
పావనములగు జాతీయశాంతివనములు !

పనిబిడాటపీస్థలుల, నేగుహాలందు నెఱుంగరాని యే
మానులపర్ణశాలల నిమంత్రితమై యెటలాగియుండెనో
యానవకావ్యశోభ! పొలియించిన స్వేచ్ఛల కీష్టవాహినుల్
వీనులకింపుగాగ వినిపింపగ పాటల నెప్డునేర్చెనో ?

సానుమతి

భానుడుపుట్టియస్తగిరిపై నిమరించె, సుధాకరుండు మం
దానిలుఁ బాలవెన్నెలలయం దిపగించిచనెన్; గభీర గం
గానదిశీతగర్భమున గానముఁ బోలె నడంగియుండె వి
జ్ఞానము లోకమందు, గగనప్రభ నేటనొ కాని నుబ్బులన్.

పూయనిపూవులందడగు పుష్పాడిరేపని, సంచెవేకటుల్
మూయనివేళ శ్యామలసభాసంశి సుందరి కానరాని తా
రాయువదీప్తులట్టులు సరస్వతిమిస్సకయుండె, నాతి నా
లాయతిచించుకొంచు కవితార్ద్రములై చనుచెంచునేతముల్.

ఆనందమ్మున నైక్యమై యపుడు బృందావనశ్యామలాంగి, వి
జ్ఞానమ్మొల్లగనల్లనెట్లాటకు ప్రైవేసన్యవిద్యాగనుల్
గానమ్ము వ్యాదజల్లి, గాఢునికి సంగాతసంవాసితే
యేనోముల్పచరించియుంటినొకొ దేవీ! యానుగ్రహప్రాప్తికై.

## మాతృపూజ

క. వీరవ్రతకంకణు లవి
వారులు గీతాకుమారవరు లీశ్వరు లీ
భారతపుత్రకులే, హిం
దూరము తలఁదాల్పఁదగు మణులు నయవేత్తల్.

చేసిన రాజకృత్యములు సింధునదీతటులందు నెన్నఁడో
మాసియు నేటికిన్ స్మరణమాత్రన సంగరలక్ష్మికందఱన్
దోసిళులొగ్గఁ జేయు కొలముల్గల; నా విజయప్రబోధ వి
ద్యామతులున్న వాసములు నల్లవిగో! హిమవంతు చేరువల్.

గీ. నర్మదాశుభ్రవీచీకణమ్ములందు
నిండియుండు స్వేచ్ఛాపురంధ్రి మనతల్లి
ఋషులనోటఁ బాడిన స్వానుభూత్మ స్తవములు
గాలి నడగిన కోకిలగాన మట్లు.

ఈవిమలప్రదేశమున నెందఱు పాడఁగలేదు లోకలీ
లావిదులై ప్రబోధసరళమ్ముగ పాటల, జన్మభూమికిన్
సేవకులై మఱెందఱు రచింపఁగలే దెదిరింపరాని తే
జోవిభవమ్ముచే ప్రజల చొప్పులయం దనురాగబాధముల్.

అల్లదె! యాంధ్రభూమి! సమరాననులన్ జయశంఖమెత్తు రా
ట్టల్లజులందుఁ గల్గిన స్వతంత్రులు వోయెడు నేల; శేముషీ

# మాతృపూజ

పల్లవితమ్ములౌ సరళభావములం దొకక్రొత్త రీతిగా
నల్లినసీను భారతమహాగానమునందలి జీవగీతులన్.

గీ. చదువులందు ధాన్యమైన దేశమ్మునందు
గౌరవమ్మున్నతమైన విద్వత్త్వమందు
సాహితీస్నేహితులగు రాజప్రముఖుల
సంతతి కసాధ్యమనెడు విచారమేల?

మధురిక

వెనుకటి వేడియూరుపులు పిట్టలొనర్చు కుహూరవములున్
గడచి మహానిలమ్మన నొకానొక మేళనమొంది యేకమై
పొదలెడు నస్ఫుటారవము పోలె క్రమమ్ముగ క్రొత్తకును మహా-
భ్యుదయము లావరించిన విభూతి యనన్యమనోజ్ఞ మంగనా!

సానుమతి

పూచియుపూయకున్న సుమముల్ సడిగానవ్వులవిచ్చుపోల్కి, స్వే
చ్ఛాచలనమ్ములందు నవసమ్మగు చేతమునమ్ముతోడ చె
ల్లాంచెదరైన సాధనములన్ దమకమ్మున చక్కఁబెట్టుకోఁ
జూచెదరిప్డు పోయిన యశోవిమలాంకము లాసఁ జేయుచున్.

గీ. వెన్నెలలురాలు నడుగుమోపినక్షణాన
నయనముల విషాదములకు నవ్వులొలయు
నామొచనుదెంచె నుదయలక్ష్మిమతల్లి
పూలపేటిక కుడిభుజమ్మున దగిల్చి.

అబ్బూరి రామకృష్ణారావు.

# ముఖలింగము

దేవమాతృకలు వర్ధిత హేమ కేదార
ఖండసస్యము లిందు పండెనేమొ
తెలుగు కళింగ రాజుల గుండెనెత్తురుల్
గడగి రక్షాదీక్ష కదలెనేమొ
శ్రీగంధ కస్తూరి కాగురుద్రవ్యమ్ము
లిట దిగంతముల వాసించెనేమొ
శూరగంగైకొండ చోడునో నీచోటు
వియ్యాలబిగువులు బిగిసెనేమొ
దక్షవాటీపురీ కవిరాక్షసుండు
ప్రళయవహ్ని శిఖాధూమ పటల మమృత
బిందుశైత్య మొకవాక్కు నందు నిచట
బిట్టు మండించి శీతలింపించె నేమొ.

ఈచోట తొలినాడు ప్రాచీసతిముఖాబ్జ
మున నెట్టు కుంకుమబొట్టు దిద్ది
ఈనేలను కళింగ భూనాథశౌర్యాన
ల జ్వాలధూమనైల్యములు గ్రమ్మి

## మాతృపూజ

ఈపవిత్రధరిత్రి నోపి త్రైలింగరా
జ్యశ్రీసుధాప్రవర్షంబు గురిసి
కడగి యిచ్చటి మంటిగడ్డలు సైతమ్ము
నవమృగీమదనాసనలు విదిర్చి

వేంగి విషయ సేన చాళుక్య విభులతోడ
మనసులో నన్నదమ్ములతనము కలిపి
మును పిచటి, తెల్గు రాజ్యించుకొనియె శౌర్య
లీల నృపలీల యీముఖలింగభూమి.

గీ. ఆ దినాల నెంతటి నిశితానురాగి
మవు కళాశిల్పములను విద్యలను చూడ
పగటివేసాలకొరకు తూర్పారఁబట్టె
ప్రాణములను కళింగ గంగరాజులైరి.

చిఱుత తరంగముల్ కలసి జీబులువారిన వంశధారలో
తరుముకువచ్చె తెల్గుల ప్రతాపశిఖల్ ముఖలింగనాథుక
న్నురిమిన నిప్పుకల్ మిషల నొక్కదినాన, కళింగగాంగు తే
లి రనిన నాళ్లునేటి కప్రులే పొనుపడ్డవి తెన్గు నిప్పుకల్.

ముఖలింగప్రభురాజు ముద్దునవలాముక్కంటిక్రొన్నిప్పుకల్
ముఖరీభూతవియత్సధ్రభ్రమరితాంభోవంశధారాపయః

# మాతృపూజ

పక్షశైత్యముచేత చెమ్మగిలి దీర్ఘాసంగృహీతప్రతా
పక్షరాంశుల్ కుదియించుకొన్న యువికానచ్ఛటా మినస్స్వర్ణచే.

ఇచటి నాగావళీ ప్రచురవర్షాంభస్త
రంగముల్ వంశధారాజలములు
తరగెత్తిన మహేంద్రతనయాసువాఃఫేస్సు
లొక్కసారిగా పొంగి యుడికిపోయి
గౌతమీకృష్ణవేణీతరంగములు తా
రాధ్వమ్ము నందు నైక్యము భజించి
తుళ్లకమ్మజలాల గుబురుగో గుబురులై
పెన్నతరంగముల్ పెరిగిపోయి

తెలుగునదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలిపడి తెల్గునేల ముగించనిమ్ము
నేటితో, నస్వతంత్రతా నియతమైన
యీ బ్రతుకు తెల్గువారు భరింపలేరు.

విశ్వనాథసత్యనారాయణ.



# కొండవీటిపొగమబ్బులు

దగ్ధాంధ్రరాజ్యనిత్యవిఘాత ధూమమ్ము
వలెఁ గొండబురుజుల కెలన లేచి
బురుజుకొమ్మల వీడి పోలేని రెడ్ల కీ
ర్తివోలెఁ బెనురాళ్ల నతుకులుపడి
రెడ్లకందావెన్క రేఁగు వంటింటి పె
న్బొగవోలె గుమురులై ముందుసాగి
ద్రాగ్ధావదాంధ్రస్వతంత్రతారమవోలెఁ
గొండ లంటీయుంటకుండఁ బోయి

శ్యామలీభవ ద్గ్రాసఘాసాదనార్థ
మొలయు వెల్లావుల కదంబములుగ నిలిచి
కొండకొమ్మలులో దాఁచుకొన్న క్రొత్త
క్రొత్తపొగమబ్బు లలమె నీకొండకొసల.

ఒకరెడ్డి సభతీర్చియున్నకొండకు వాలు
కొసలతో ముత్యాల గొడుగుపట్టు
ఒకరెడ్డిమూర్తి పోలికతీరియున్న కొం
డకు కోసగా కిరీటమ్ము పెట్టు

## మాతృపూజ

ఒక్కయంతఃపురవధూతృప్తిఁజను బురు
జున సన్నమేలిముసుంగు తోడుగు
ఒక తెల్లబాటు శీవికి ముద్రగొనియున్న
బురుజుపజ్జ మహాసివోలె వ్రేలు
ఈజగా పొగమబ్బులు రాజసేవ
మఱచిపోలేవు రసధునీమహితమూర్తి
లేము లెక్కించుచుంటిమి యెన్నినాళ్లు
చనెనో అనివందలేళ్లుగా చాఁచుకొంచు.

అస్మదగ్రాతిథేయారబ్ధములు రెడ్ల
భువి వంటశాలల పొగ లటంచు
అచట శ్రీనాథకావ్యశ్రోతలగు మాకు
పఱచిన పందిళ్ల పఱపు లంచు
కొండకొమ్ముల తీర్చుకొని నిల్చియున్న యాం
ధ్ర భటాళిగిరగంధా లటంచు
ఉత్సవాగతజన మెక్కిఁగి పోఁ గొండకొ
మ్ములఁదొంగి కను రెడ్లముగుద లనుచు
మున్ను గుర్రాల దూకించుకొన్నచోట
నడుగడుగునందు పాతంబులైన మాకు

నప్పుడప్పుడు తలలెత్తి నంత కొండ
కొసలమబ్బులు పొరపెట్టి విసరులాడు.

ఒకసారి వలిపమ్ము చికిలిముత్యాల యం
చుల వాలిక నుపత్యకల చరించు
ఒకసారి జఘనభాగోపరిస్రస్త చే
ల విధాన గిరి మొదళ్లఁ బడిపోవు
ఒకసారి గిరిలక్ష్మి మొకముపై మొగలి పు
ప్పొళ్లఁదుకొన్నట్లు చెల్లరేఁగు
ఒకసారి స్వేదబిందుకములు రత్యంత
వేళాకుచావృత్తి విస్తరించు

చిఱుత పొగమబ్బు లీకొండసీమ పలుచఁ
బడి, విశీర్ణమై, ధూతమై, తడిసి, రాచ
సిరి యుడిగిపోయినట్టి యీ శిథిల దుర్గ
లక్ష్మి కొనఁగూర్చు వెట్టి యలంకృతులను.

అధిరూఢకుం డినేశాత్మజ మణుప స్యా
దన గరుత్మన్మండ తద్ధ్వజమ్ము
గజపతి ప్రౌఢోగ్ర కరిఘటా శుండా వి
ధూతాంబు నిచయబిందూత్కరంబు

# మాతృపూజ

రెడ్లకీర్తిపతాక శ్రీనాథకవికావ్య
    దూతహంసాధినాథుని గరుత్తు
అలకసవాపాత్రు నంటి రాఁజినకృష్ణ
    రాయ బాహాగ్రజాగ్రన్మహాగ్ని
ఒకటొకటి గాఁగ స్మృతి తెచ్చుచున్న వన్ని
చిఱుత లీ పొగమబ్బులు చిందులాడి
కొండవీటి ప్రాఁగోటపై కొమ్ములందు
నవ్యవక్షేందిరా ధురంధరనిరూఢి.

నిప్పులు చూడ మన్నీ లుత్కలప్రౌఢ
    పాత్రులు బురుజుల పైన లేరు
ఈ తెలఁగుమ్మ శౌర్యేందిరా పుంమూర్తు
    లైన రెడ్డికోటపైన లేరు
గుండెలకత్తులఁ గ్రుమ్మ రాయల రాచ
    యేనికగున్న లీపైన లేరు
అడుగడ్గునకుఁ బ్రాణ మాహుతి గొనఁగ ద్వాః
    స్థాన రక్షక భటులైన లేరు
ఓసి పొగమబ్బులార! రండోసి రండు
మీకు మాకిష్టమే యిష్టమాక లేక

# మాతృపూజ

తిరుగవచ్చురాజులు కొల్వు తీర్చుచోట
నరుగవచ్చు రాకన్నెలున్నట్టిచోట.

ఎంతనిర్భయముగా నీపొగమబ్బులు
  జెట్టీల బురుజుపై చిమ్మిరేఁగు
ఏలెక్క లేనట్లె యీ పొగమబ్బులు
  మిరియాల తఖతుపై తఱిమిపోవు
ఇంతయడ్డంకి లేకీ పొగమబ్బులు
  తారాబురుజుమీఁద దాఁట్లువెట్టు
ఈమాత్ర మాఁకలేక పొగమబ్బులు
  కేళిశుద్ధాంతసౌధాళిఁ జొచ్చు
పిచ్చిపొగమబ్బులార! కోపించిరేని
చెడ్డవారుసుమీ! మిమ్ము చించికొమ్మ
తాఁచిచెండాడిపోదు రడ్డంకిరెళ్లు
లేని హానమ్ము లడ్డంకి లేసిరెళ్లు.

ఇడుపుల విలిఖించిరేమొ నా ముక్తాక్ష
  రములుగా దుర్గకుడ్యముల నొలసి
ఇచట ముఁగ్గులుపెట్టిరేమొ నాక్లుప్త ము
  క్తారేఖగా గిరిస్థలము మెఱసి

ఇట వితాన మమర్చిరేమొ నావృద్ధు మరు
　　చ్చలితమధ్యమై చదలఁ దీఁచ
ఇట కేళకుళి వెట్టిరేమొ నా తుదల శీ
　　తలపృషత్ప్రోక్షించితములఁ గదలి
ప్రాతరనతిక్రమితయామ భానురోచి
రాసమాత్తధావళ్య మర్యాదమైన
లేఁత యీపాగమబ్బు పురాతనంబు
త్రవ్వుచున్నది రెడ్డి యాంధ్రప్రశస్తి.

ఇవి రెడ్డిరాజుల యెదలలో పూరించు
　　కోరాని కోర్కెలు గుములుకట్టి
ఇవి తెల్గుబంటుల ఝుఁదుపగింజలై
　　నాత్మలు పీడ లే కరుగుదెంచి
ఇవియు శ్రీనాథుని యెఱ్ఱప్రగ్గడకావ్య
　　తకు రానిభావముల్ తరకగట్టి
అవచి తిప్పయసెట్టి వివిరత్నరాశిగా
　　మలఁచిన ప్రాణముల్ మగిడివచ్చి

కొండవీటి పొలాల్ వీడి కోనులేక
ఆశబలమున మగుడు ప్రేతాత్మల వలె

# మాతృపూజ

సొరిది నీగిరికొమ్ముల చుట్టుపట్ల
నిట్టిపొగమబ్బులై భ్రమియించు గాక.

నా ప్రాణములకును నీపొగమబ్బుల
కేమి సంబంధమో యేను గూడ
పొగమబ్బునై కొండ చిగురుకొసల మైన
బురుజులపైన కొమ్ములకు పైన
వ్రాలిపోనో మధ్య వ్రీలిపోనో నేల
రాలిపోనో గాలి తేలిపోనో
నాయూహా చక్రసుందరపరిభ్రమణమై
యీ పొగమబ్బుల సేవరించె
ఎన్ని పొగమబ్బులెజిఁగిలే నేను మున్ను
తూర్పుకనుములు విడుచు నిట్టూర్పులట్టి
విచటి యీ పొగమబ్బులే యెడదలోని
లలితము మదీయగీతి నేలా వెలార్చు!

విశ్వనాథ సత్యనారాయణ.



# నైవేద్యము

తల్లి, నీయుత్సవముఁ గాంచఁ దరలినార
లనుఁగుఁ దనయులు నైవేద్య హస్తులగుచు;
ధన్యులెల్లరు నాత్మోచితంపుఁ గాన్క
లర్పణము సేయవచ్చిరి; యందికొమ్ము.
స్వర్ణసుమముల నర్చన సలుపువారు
భాగ్యవంతులు నీపాద పద్మములకు;
ఏమి లేనట్టి భిక్షుకుండేని నేఁడు
కంటిక్రొన్నిటి ముత్యాల కాన్కలిడును.
పూజ్యు లధములు, ధనికులు పుట్టుబీద
లనెడి యెడలేక యెత్తిరి హారతులను;
భక్తిపరవశులైన యా ప్రజలగీతి
దిక్కుదిక్కులయందుఁ బ్రతిధ్వనించు.
అమ్మరో! నీదు మందిర ప్రాంగణమున
మండుచున్నది కర్పూర ఖండగణము,
త్యాగపరిశుద్ధ మగు నాత్మఁ దలఁగిపోవు
కామమటు ధూమ రేఖలు గడలుకొనఁగ.
ప్రొద్దుపొడుపున నీ పాదపూజ కొఱకు,
కవిని, తెచ్చితి దోసిటఁగన్నె పూలు;
బలివితర్దిక నిరతంబు వెలుగు నటుల
హృదయపు సుగంధదీప మర్పింతుఁ గొనుము

దువ్వూరి రామిరెడ్డి.



# సేవ

మముఁగన్న భారతమాత మందిరమున
దివ్వెలై మన ముందామా, పైడి
దివ్వెలై మన ముందామా.

పరమపావనితల్లి పాదపూజల వాడు
పువ్వులై మన ముందామా, పొన్న
పువ్వులై మన ముందామా.

భారతీదేవి విపంచిక రవళించు
తంత్రులై మన ముందామా, దివ్య
తంత్రులై మన ముందామా.

జన్మభూమీశౌర్య సౌరభ్యములు చల్లు
గీతలై మన ముందామా, భావ
గీతలై మన ముందామా.

కదన వీరులచేతి ఖడ్గధారలలోని
మెఱుపులై మన ముందామా, కాఱు
మెఱుపులై మన ముందామా.

దువ్వూరి రామిరెడ్డి.



# పద్మనాభము

తెనుగు వీరుల విమలకీర్తిప్రభావ
మతుల విజయప్రతాప శౌర్యప్రశస్తి
పోయెనకట! నిర్మూలమై పోయె నిచట
లంచగొండుల కుటిల కల్పనము వలన
మాతృదేశ విద్రోహుల మాయవలన.

నిర్నిరీక్షప్రతాప సందీప్తి శాలి
పూసపాటి విజయరామ భూపమౌళి
తొలగి చనెనట సూర్యమండలము దాటి
విపుల సామంత గణపరివేష్టితుడయి.

వరదలై భూతముల మెడబంటిగాగ
శూరజన కంఠ నిర్గత శోణితమ్ము
పారె నీ పూతధాత్రి నిబ్బరము తొలగి
స్వర్గవాసులు రెప్పవాల్పకయె కాంచ.

అవ్వి భారతస్వాతంత్ర్య హరణయోగ
వాసరము తొలుత నాంధ్రసర్వస్వతంత్ర

## మాతృపూజ

రాజ్యలక్ష్మి పాశ్చాత్యుల ప్రాపుచేరె
నిచట; దైవయోగమునకు నెదురు కలదె!

ఆ నితాంత కఠోర దృశ్యావలోక
నమున సహజార్ద్రమృదుల మానసము చెదర
కంటనీ రొట్టి నిలువక కరగి పారు
నేటికిని సైత మీ గోస్తనీస్రవంతి.

భయద దాస్యవిశృంఖలా బంధితుడవు
ఓయి! జీవచ్ఛవాంధ్రుడా! ఒక్కమారు
బలుకని మ్మిట నింత కవోష్ణబాష్ప
మలినధార స్వాతంత్ర్య సంప్రాప్తి కొరకు.

పురిపండా అప్పలస్వామి.



# దేశభక్తులు

చిరపరాధీన శృంఖలాచ్ఛేదమునకు
జీవితసుమాలె ధారవోసితిరి మీరు
కురియదే నేడు స్వర్గీయ కుసుమవృష్టి
శ్రీవిరాజిల్లు మీయోధ శిరము లందు.

బాధలే భాగ్యముగ నోడిబట్టజాలు
భారతాశ్రమ తరుణ తాపసులు మీరు
ఏ నిరంకుశు లేని బంధింప నింక
నిగళముల త్రెంచుకొనెడు సైనికులు మీరు.

స్వార్థలవమేనిలేని మీ త్యాగ గరిమ
ప్రాకిపోయెను ఖండాంతరాల దాటి
ఇది స్వరాజ్య రమానవాభ్యుదయవేళ
నభమె నినదించే విజయదుందుభుల మ్రోత.

పురిపండా అప్పలస్వామి.



# ఉయ్యాలా! డంబాలా!

ఉయ్యాలా! డంబాలా! భారత నవజీవన బాలా!
పూరిత సత్యాగ్రహశీలా! పరిభవ దుఃఖిత పాంచాలా!
నీపురుడు - ఏ నెలలో - వెన్నెలల - క్రొన్నెలలో
నీపుట్టు - వెదోచ్ఛట - మిన్నేట - మున్నేట— ఉయ్యాలా...
తొలినాటి - వేదాలు - పులివోని - చనుబాలు
మఱునాటి - కావ్యాలు - కమ్మగు - జనగూళ్ళు ఉ...
శ్రీరామాయణకథలు - ఊకొన్న వాక్సుధలు
భారతగీతారుతము - చందాయి యమృతము? ఉ...
బుద్ధుడు నీసంబుద్ధి - యవనులోకో నీకుద్ది
మొగల్ మరాటుల్ చేబంతుల్ - రసపుత్రుల్ చేమంతుల్ ఉ...
పాశ్చాత్యమ్ మోహాంధమ్ - ప్రాచీనమ్ ప్రియబంధమ్
ఆధ్యాత్మమ్ కళ్యాణమ్ - స్వాతంత్ర్యమ్ శతమానమ్ ఉ...
నీ మెట్టు నీలాలు - నీచుట్టు నీరాలు
జడదొట్టు తలంబ్రాలు - ఒడిగట్టు మగరాలు ఉ...
ముజ్జగపు దీవెనలు - ముప్పదికోటుల జనులు
జయజయవాద్యోన్నతులు - జేజేల హారతులు ఉ...

కవికొండల వేంకటరావు.



# జాతీయ గీతిక

హిమగిరి శిఖరము - వింధ్యనగేంద్రము
కన్యాకుమారీ పదడిండీరము
స్ఫురితము - భరితము - చలింతోల్లలితము
స్వాతంత్ర్యముచే - స్వాతంత్ర్యముచే
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

జాహ్నవి, గౌతమి, కృష్ణ, పినాకిని,
కావేరి, నర్మద యమునా సింధులు
అహర్నిశాదులు - ఒకటేగానము
కలలో - అలలో - అదే ప్రయాణము
స్వాతంత్ర్యముకై - స్వాతంత్ర్యముకై
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్.

గుజరాత్, వంగ, అంగ, మరాఠా,
త్రిలింగ, తమ్మిళ, కళింగమును జను
అజరులు - అమరులు - అనామయులుగా
స్వాతంత్ర్యము హేయ్! స్వాతంత్ర్యము హేయ్!

## మాతృపూజ

స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

నౌరోజ్ తిలకులు, లజపద్దాసులు
దాని పథంబున, నలిగిన నొగిలిన
వెచ్చని నెత్తుటి దివిటీ వెలుగున
స్వాతంత్ర్యంబదె! - స్వాతంత్ర్యంబదె!
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్;

ఇంగ్లం డమెరిక, స్వీడన్, స్విజ్జు,
జపాను, జర్మని, కీచు, పరాసు,
అంబ విశ్వకళ కభివాదన మిడు
స్వాతంత్ర్యమురా, స్వాతంత్ర్యమురా
స్వాగతమనవోయ్, కని, పనివినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

కవికొండల వేంకటరావు.



# నా జన్మభూమి

౧

నా జన్మభూ మేదిరా
బాపుజీ!
నాముద్దు తో టేదిరా?
నాకోకిల మ్మేది, నాపూలమే డేది,
నారాశిపీ ఠేది, నావలపుపా టేది.
కలలోని సిరులాయెరా
బాపుజీ
కారడవిపాలైతిరా!

౨

నాయేటి లంకేదిరా
బాపుజి!
నాయాలమం దేదిరా!
నామేని పొంగేది, నామనసు పరుగేది
నాగస్వర మ్మేది, నాయేల పా టేది?
కాలమిట్లైపోయెరా
బాపుజి
కన్నీరె యే రాయెరా!

## మాతృపూజ

ఏనాటి కథలాయెరా?

బాపుః!

ఈజీవ మెటునిల్చెరా?

నాప్రేమ గెలిచేనా? నాతోట పూసేనా?

నావీణ మ్రోగేనా? నాపాట పాడేనా?

నాపాలిప్రభు వేడిరా?

బాపుః!

నాకృష్ణు డేమాయెరా?

తురగా వేంకటరామయ్య.



# దొరవు నీ వయ్యేదవురా!

పరమశివుడే తండ్రిరా! ఈ
ప్రకృతిసుందరి తల్లిరా!
పాడియావులు పంటపొలములు
భాగ్యములు రాజ్యములురా!

గున్నరా ఈ భరతభూమిని
తొలుకరించిన పుణ్యభూమిని
కరువులేని స్వర్గరాజ్యపు
దొరవు నీ వయ్యేదవురా!

కాలమే తలక్రిందుగాని
కాలయముడే యేలుకోనీ
నీవు నీగోవులును శాశ్వత
జీవులై యుండేరు గదరా! దొ...

పాడు నేలే లేదురా! నీ
భావమే బీడాయెరా!
పరిమళించే తోట పెంచీ
పరమశివు నాడింపరా! దొ...

## మాతృభూమి

గాలివెలుగులు జూడరా! మే
ఘాల వర్షము నడుగరా!
సూర్యచంద్రుల గమన లీలా
శోభలను దిలకింపరా! దు...

ఏటి లంకల మేత మేసీ
పూతగిల్లిన జోడు గిత్తల
పైడి నాగటి కర్రులో జీ
వాల జీవిత ముండెనోరా! దు...

పైరులను గాచేటి సుందరి
ప్రకృతితో వెలిగేనురా! ఆ
మేడలో వర్తించు రాణికే
కూడుగుడ్డలు దూరమగురా! దు...

ఆలుమగలూ జోడు గూడి
ఆడుకొంటూ పాడుకొంటూ
జీవకాంతుల వెలుగు సస్య
శ్రీలలో విహరించెదరురా! దు...

## మాతృపూజ

శుభద మగు 'రాట్నంపు' శ్రుతితో
సుందరీమణి పాడుచుంటే
పొంగుతూ ఆడేటి బిడ్డలే
భూము లన్నీ యేలెదరురా! ద...

కత్తికలములు వ్రాలెరా! నీ
కష్టమే గెలిచేనురా!
ప్రకృతిపురుషుల ప్రతినిధులు మీ
ప్రభుత యే నిత్యమ్మురా!

దున్నరా ఈ భరతభూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువు లేని స్వర్గరాజ్యపు
దొరతనంబు నీవయ్యెదవురా!

తురగా వేంకటరామయ్య.



# మా గాంధి

కొల్లాయి గట్టితేనేమి ?
మా గాంధి,
కోమటై పుట్టితే నేమి ?
వెన్నపూసా మనసు
కన్నతల్లీ ప్రేమ
పండంటి మోముపై బ్రహ్మతేజస్సు! కొ.

నాల్గు పరకల పిలక
నాట్యమాడే పిలక,
నాలూగూ వేదాల నాణ్యమెరిగిన పిలక ! కొ.

బోసి నో రిప్పితే
ముత్యాల తొలకరే,
చిరునవ్వు నవ్వితే వరహాల వర్షమే ! కొ.
కౌశికుడు క్షత్రియుడు
కాలేద బ్రహ్మఋషి
నేడు కోమటిబిడ్డడౌను బ్రహ్మఋషాయె కొ.

కొల్లాయి గట్టితే నేమి ?
మా గాంధి,
కోమటై పుట్టితే నేమి ?

బసవరాజు వేంకటప్పారావు.



# దుందుభి ధ్వానము

చాటవే! — దుందుభి! — చాటవే! —

౧

చేదుపుర్వుఁ బాచదారకుఁ
జేరఁదీసి గ్రహించు నార్యుల
వాదములలో భేదభావము
లేదు లేనేలేదు లేదని— చాటవే—

౨

దారుణక్రియలెన్ని చూపిన
నోరు పనియెడి మూలమంత్రము
గోరు ముద్దలఁ్తోడ నేర్చిన
భారతీయులు భయము పడరని— చాటవే—

3

నల్ల మషుగులు నింపఁ గుటిసెషి
బొల్లి మబ్బుల దుర్లఁగొట్టుషి
చల్లగాడ్పులు భరతభూముల
నెల్లదిక్కుల నల్లుకొనె నని— చాటవే—

౪

ప్రేమసింధు తరంగములలో
సామగానము వెడలె భారత